


1916లో వారణాసి (బెనారస్) లోని సెంట్రల్ హిందూ కాలేజ్ (ఇప్పటి బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం) ప్రచురించిన "Sanatana Dharma: An Elementary Textbook of Hindu Religion and Ethics" అనే గ్రంథం, హిందూ మతం, నైతికతపై సమగ్ర అవగాహనను అందించే అపూర్వ గ్రంథంగా నిలిచింది. అంత ర్జాలంలో అపూర్వ గ్రంథాల వరుసలో ప్రథమంగా నిలిచింది. ఈ గ్రంథం ప్రధానంగా 'ఆ కాలంలో' 'అప్పటి' ప్రాథమిక స్థాయి కలిగిన విద్యార్థుల కోసం రూపొందించబడింది. కానీ హిందూ ధర్మాన్ని లోతుగా అర్థం చేసుకోవాలనుకునే ఎవరైనా దీనిని ఉపయోగించుకోవచ్చు. బాలవ్యాకరణం పేరుకి బాలురకోసం వ్రాసానని చిన్నయ సూరి చెప్పినా, అది పండితులకి ఎలా పరమ ప్రామాణికం అయిందో అలా ఈ సనాతన ధర్మం పుస్తకం బాలుర కోసం వ్రాసినా హిందూధర్మాన్ని తెలుసుకోవాలనుకొనే ప్రతి ఒక్కరికి ఆరాధనా గ్రంథమయింది. ఈ పుస్తకం తరువాత సనాతన ధర్మంపై ఎన్ని పుస్తకాలు వచ్చినా ఈ పుస్తకమే సనాతన ధర్మానికి కాళిదాసు చెప్పిన దీప శిఖ అయింది. సాధికారిక గ్రంథమయి, రిఫరెన్స్ పుస్తకంగా నిలిచింది. ఈ పుస్తకానికి ఇంతవరకు తెలుగులో అనువాదం రాలేదు. మొట్టమొదటిసారిగా ఆచార్య తాడేపల్లి పతంజలి దీనిని తెలుగులోకి అనువదించారు. మూలంలో ఉపనిషత్, వేద, ధర్మ శాస్త్రాల శ్లోకాలు కేవలం టెక్స్ట్ వరకే ఇవ్వబడ్డాయి. వాటి వివరణ చాలా చోట్ల లేదు. పతంజలి వాటిని శ్రమకోర్చి తెలుగులోకి అనువదించారు. ఆచార్య తాడేపల్లి వారిచేత ఈ పుస్తకాన్ని తెలుగులోకి అనువదింపచేసిన ఖ్యాతి తొలుతగా శ్రీ యం.యం. గుప్తా, గుప్తా ఫౌండేషన్ ట్రస్టీ, కీర్తిశేషులు ఆచార్య పప్పు వేణుగోపాలరావు గార్లకు దక్కుతుంది. వారికి దర్శనం మాసపత్రిక హృదయ పూర్వక ధన్యవాదాలు తెలియచేస్తున్నది. మా అభ్యర్థనపై ఈ పుస్తక అనువాదాన్ని నెలనెలా ప్రచురించుకోవటానికి అంగీకరించిన రచయితకి, అనువాద ప్రేరకులకు దర్శనం మాసపత్రిక కృతజ్ఞతలు తెలియచేస్తోంది. ఈ నెల మొదటి భాగంలో పుస్తకంలో ఏముందో తెలియ చేసే పరిచయ పరిమళాలు ఉన్నాయి. సనాతన ధర్మాభిమానులు ప్రతి నెల ఈ పుస్తక భాగాలను చదివి సనాతన ధర్మ పోషణలో భాగస్వాములు కావాలని కోరుతున్నాం.

Sanatana Dharma: An Elementary Text Book of Hindu Religion and Ethics అనే ఈ పుస్తకం హిందూ మతం, నీతికి సంబంధించిన ప్రాథమిక పాఠ్యపుస్తకము.ఇది హిందూ ధర్మం, మత సూత్రాలు, మరియు నైతిక విలువల గురించి సరళంగా, సులభంగా అర్థమయ్యే విధంగా వివరించే గ్రంథం.

ఈ పుస్తకాన్ని 19వ శతాబ్దంలో The Central Hindu College, Benaras వారు ప్రచురించారు. దీని మూల ఉద్దేశ్యం యువతకు హిందూ మతతత్వాన్ని, దాని ఆచార వ్యవహారాలను సరళమైన శైలిలో అందించడం. ఇందులో వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, ధర్మ శాస్త్రాలు మొదలైన ప్రామాణిక గ్రంథాల సారం పొందుపరచ బడింది.

ఈ పుస్తకం సనాతన ధర్మానికి ప్రామాణిక రూపం -హిందూ ధర్మాన్ని సరళంగా, ఆధునిక దృష్టితో





సమగ్రంగా వివరిస్తుంది. విద్యార్థులకు, ఆధ్యాత్మికతను కొత్త కోణంలో అర్థం చేసుకోవా లనుకునే వారికి మేలైన గ్రంథం. కేవలం మతపరమైన విషయాలు మాత్రమే కాకుండా, నైతిక జీవన విధానాన్ని కూడా ఈ పుస్తకం వివరిస్తుంది.అధ్యాత్మిక, తత్వపరమైన పఠనానికి పునాదిగా - వేదాంతం, భక్తి, కర్మ సిద్ధాం తాలు మొదలైన మౌలిక విషయాలను లోతుగా చర్చిస్తుంది.

హిందూ ధర్మాన్ని అంతర్భాగంగా అర్థం చేసుకోవాలనుకునే వారికీ ఇది ఒక అపూర్వమైన మార్గదర్శక గ్రంథంగా ఉపయోగ పడుతుంది.

ఈ పుస్తకం తెరవగానే "సత్యమేవజయతేనానృతమ్" (సత్యమే గెలుస్తుంది, అసత్యం గెలవదు. )ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత (నీ సమస్య విషయంలో మేలుకో. జ్ఞానయోగ సాధనచేయి. అర్హుడైన గురువును ఆశ్రయించి బ్రహ్మవిద్యను కోరుకో. లేవండి, మేల్కొనండి. మరియు లక్ష్యాన్ని చేరుకునే వరకు ఆగకండి) అనే రెండు అపూర్వమైన వాక్యరత్నాలు మనకు కనిపిస్తాయి.

ఈ పుస్తకాన్ని ఎందుకు వ్రాయించామో తెలియచేస్తూ ప్రచురణకర్తల తొలిపలుకు ఈ వాక్యరత్నాల తర్వాతి పుటలో ఇలా కనబడుతుంది.

### తొలిపలుకు

కేంద్రీయ హిందూ కళాశాల ధర్మకర్తల మండలి తమ అధీనంలోని విద్యా సంస్థలలో మతపరమైన మరియు నైతిక బోధనను అందించేందుకు కొన్ని ముఖ్యమైన మార్గదర్శకాలను రూపొందించింది. ఈ బోధనలో హిందూ ధర్మ సూత్రాలను, దానికి తగ్గట్టుగా పాశ్చాత్య విద్యా పద్ధతులతో సమన్వయం చేయడం కళాశాల ప్రధాన లక్ష్యం...

ఈ బోధనలో విస్తృత దృక్పథం, సహనం, మతాతీత స్వభావంఉండాలి. అయితే ఇది ప్రత్యేకంగా హిందువులకు సంబంధించినదిగా ఉండాలి. హిందువులలోని విభిన్న ఆలోచనా విధానాలను సమన్వయం చేసే సామర్థ్యం దీనికి ఉండాలి. వివాదాస్పద సిద్ధాంతాలను వీలైనంత వరకూ పక్కన పెట్టాలి.

ఈ బోధన:

- సామాజిక, రాజకీయ అంశాల్లోకి ప్రవేశించకూడదు.

### కృతజ్ఞతలు

ఈ పుస్తకాన్ని తెలుగులో అందుబాటులోకి తేవడంలో ముఖ్య పాత్ర వహించిన శ్రీ యం.యం. గుప్తా, గుప్తా ఫౌండేషన్ ట్రస్టీ, కీర్తిశేషులు ఆచార్య పప్పు వేణుగోపాలరావు గార్లకు హృదయపూర్వక ధన్యవాదాలు తెలియచేసుకొంటున్నాను. వీరి ప్రేరణ లేకపోతే ఈ అనువాదం చేసి ఉండేవాడిని కాదు.

దర్శనమ్ మాసపత్రికలో సనాతనధర్మం అనువాద పుస్తకాన్ని ధారావాహికంగా ప్రచురించడానికి ముందుకు వచ్చిన సనాతన ధర్మాభిమానులు, సహృదయులు మరుమాముల వెంకటరమణశర్మ గారికి కృతజ్ఞతలు.



○ విద్యార్థికి మతం, నైతికతపై దృఢమైన అవగాహన కల్పించాలి.
○ వ్యక్తిత్వ నిర్మాణానికి ఉపయుక్తమైన విలువలను ధర్మ నిష్ఠ, విధేయత, స్వావలంబన, నిష్కల్మషతనం, వినయం, సమతుల్యత వంచన లేకుండా బోధించాలి.
○ హిందువులను కలిపే సిద్ధాంతాలను స్పష్టంగా బోధించి, విభజించేవాటిని విస్మరించాలి.



○ ఇతర మత విశ్వాసాల పట్ల గౌరవ భావన పెంచాలి.
○ మతపరమైన విశ్వాసాలు భిన్నమైన మార్గాలుగా ఉన్నా, అందరూ ఒకే పరమాత్మాన్ని చేరుకోవడమే లక్ష్యమనే విషయాన్ని బోధించాలి.

### ఈ పుస్తకంలోని ప్రధాన అంశాలు

1. సామాన్యంగా హిందువులందరూ అంగీకరించే మతపరమైన, నైతిక బోధనలు ఇందులో ఉండాలి.
2. ఇతర మతాల కంటే హిందూమతాన్ని ప్రత్యేకంగా చూపించే అంశాలు ఇందులో తప్పక ఉండాలి.
3. ఏదైనా ఒక నిర్దిష్ట సిద్ధాంతం లేదా సంప్రదాయానికి మద్దతునిచ్చే విధంగా ఉండకూడదు.

ఈ పుస్తకం భారతదేశంలోని హిందూ విద్యార్థుల కోసం ప్రత్యేకంగా రూపొందించబడింది. వారి మతంపై సరైన అవగాహన కల్పించేందుకు ఇది ఉపయోగపడుతుంది. కళాశాల స్థాయికి చేరుకున్నాక మరింత లోతైన అధ్యయనం చేయగలిగేలా ఇది ప్రాథమిక అవగాహన ఇస్తుంది.

పాఠ్యాంశాలలో భిన్న అభిప్రాయాలను ప్రస్తావించకుండా, ప్రామాణికంగా అంగీకరించబడిన సిద్ధాంతాలను మాత్రమే పొందుపరిచారు. విద్యార్థులు దీనిని స్వయంగా చదివి ఉపయోగించుకోవచ్చు. ఉపాధ్యాయులు క్లిష్టమైన విషయాలను సులభతరం చేయగలరు.

ప్రతి అధ్యాయంలో చివరగా శ్లోకాలను ఇచ్చారు. విద్యార్థులు వీటిని పఠించడం వల్ల తమ మత సంపదను తెలుసుకునే అవకాశం లభిస్తుంది.

### సనాతన ధర్మం - ఒక శాశ్వత దృక్పథం

ఈ పుస్తకంలో "సనాతన ధర్మం" అంటే "శాశ్వతమైన ధర్మం" అని అర్థం చేసుకోవాలి. భారతదేశంలోని కొన్ని ప్రాంతాల్లో దీని ప్రాముఖ్యత తక్కువగా ఉన్నా, దీనిలో పొందుపరిచిన నైతిక బోధనలు అన్ని హిందూ సమాజాలకూ వర్తిస్తాయి.

ఈ పుస్తకం హిందూ యువతలో మతపరమైన అవగాహన, దేశభక్తి, నైతిక విలువలు పెంపొందించేందుకు ఎంతో ఉపయోగపడుతుంది. యువత మతంపై సరైన అవగాహన పెంచుకోవడానికి, సమాజానికి ఉపయోగకరమైన పౌరులుగా ఎదగడానికి ఈ పుస్తకం సహాయపడుతుంది." అని ప్రచురణకర్తలు పేర్కొన్నారు.


తాడేపల్లి పతంజలి

ఈ పుస్తకాన్ని మూడు భాగాలుగా విడగొట్టారు.

హిందూ మతానికి సంబంధించిన ప్రాథమిక భావాలు ఒకటవ భాగములో ఆరు అధ్యాయాలలో ఉన్నాయి. అవి వరుసగా పరిచయం , అఖండ సత్యం, పునర్జన్మ, కర్మ, త్యాగం, కనిపించు, కనిపించని ప్రపంచాలు.

ఇక రెండవ భాగము ఆచారాలు, సంస్కారాలకు సంబంధించింది. ఇందులో సంస్కారాలు, శ్రద్ధ, శౌచం, నిత్యం చేయవలసిన పంచ యజ్ఞాలు, ఆరాధన, నాలుగు ఆశ్రమాలు, నాలుగు వర్ణాలు అను ఏడు అధ్యాయాలు ఉన్నాయి.

మూడవ భాగము నైతిక బోధనలకు సంబంధించింది. నీతి శాస్త్రం అంటే ఏమిటి? మతం ద్వారా నీతి స్థాపన, మంచి, చెడు, నైతిక శాస్త్ర ప్రమాణం( ధర్మ నిర్ణయ పద్ధతి), ధర్మాన్ని నిలబెట్టే గుణాలు, ఆనందం, భావోద్వేగాలు, స్వీయ నియంత్రణకు సంబంధించిన గుణాలు, మెరుగైన స్థితిలో ఉన్నవారితో (గురువులు, పెద్దలు, అధికారులు) సంబంధమున్న నైతికత, దోషాలు, సమాన స్థాయిలో ఉన్నవారితో (స్నేహితులు, సహచరులు) సంబంధమున్న నైతికత మరియు దోషాలు, తక్కువ స్థాయిలో ఉన్నవారితో (చిన్నవారు, అనుచరులు) సంబంధమున్న నైతికత, దోషాలు, ధర్మబద్ధమైన, అధర్మబద్ధమైన కర్మల పరస్పర ప్రభావం అను 11 అధ్యాయాలు ఇందులో ఉన్నాయి.

ఈ భాగాలు, అధ్యాయాల గురించి సనాతనధర్మం అనే ఈ పుస్తకంలో ఏమి చెప్పారో వచ్చే నెల నుంచి క్రమం తప్పకుండా తెలుసుకొందాం. (సశేషం)

